# విషయసూచిక

# సారాంశం

తల్లిగా, దేవతగా విధాత సృష్టించిన శక్తి మాతృశక్తి, మహిళా శక్తి. ఇది పరమ పూజ్యమైన దేవతారూపం. దేవత్వ ప్రతీకలలో ప్రథమస్థానం స్త్రీది; రెండవది పురుషునిది. భావసంవేదన, ధర్మధారణ, సేవాసాధనల రూపంలో ఆమె శ్రేష్ఠత చరితార్థం అయింది.

స్త్రీ శక్తి గడచిన రోజులలో అనేక భయంకర పరిస్థితులను చూసింది. ఫ్యూడల్ అంధకార యుగం నుండి పుట్టిన అనర్థం పరిస్థితులను తలక్రిందులు చేసింది. ఆమెను అబలగా భావించడం జరిగింది. భోగినిగా, రమణిగా, అనుభవించతగినదిగా, దాసీగా ఉండడం ఆమెకు తప్పనిసరి అయింది. పూజ్యభావంతో చూడవలసిన స్త్రీ చెడుదృష్టితో చూడబడింది. కానీ ఇప్పుడు పరివర్తన తుపాను ప్రవాహం ఈ సగం జనశక్తిలో ఉప్పొంగడానికి వేగం పుంజుకుంది. పాశ్చాత్యుల స్త్రీ విముక్తి ఆందోళనకు భిన్నంగా ఈ మహిళాశక్తి జాగరణ ప్రక్రియ దైవ చేతన ద్వారా నిర్వహింపబడుతుంది. బుద్ధికి అనుగుణంగానే ఇది నడుస్తున్నది. మహా పరివర్తన వేళలో సత్యయుగం తిరిగి రావడాన్ని గురించిన చర్చ జరుగుతున్న ఈ తరుణంలో గాయత్రీపరివారమే కాక ప్రపంచమంతా ఈ సగం జనశక్తి లేచి నిలబడడం, రంగస్థలంపై ప్రముఖ పాత్రను వహిస్తూ ఉండడం చూడగలదు. విద్య, స్వావలంబన లాంటి వివిధ కార్యక్రమాల ద్వారా మహిళా జాగరణ జరుగుతోంది. ఆమె పౌరోహిత్యం నుండి యుగనాయకత్వం వరకు అనేక బాధ్యతలు నిర్వహిస్తుంది. ఇది కల్పన కాదు, పచ్చి నిజం.

H H H

# పరమ పూజ్య దేవీమూర్తి మహిళ

జీవసృష్టి నిర్మాత ఆదిశక్తి, మహామాయ. ఆమెను విధాత అనీ, మాత అనీ కూడా పిలుస్తారు. మాతృశక్తి ప్రాణులపై దయ కురిపించకపోతే ఆ శక్తి ఉనికి వెలుగులోనికి వచ్చేది కాదు. గర్భం లోపలి ప్రారంభదశ ఒక సూక్ష్మ బిందువుగా మాత్రమే ఉంటుంది. తల్లిలోని చేతన దానిలో ప్రవేశించి దానిని పరిపక్వం చేస్తుంది. ప్రసవ వేదనను సహించి ఆమెయే ఆ శిశువు బంధనాలను త్రెంచి, దానికి ప్రపంచ ఉద్యానవనంలో ప్రవేశించగల స్థితిని కలిగిస్తుంది. అసమర్థమైన, వికసించని స్థితిలో శిశువుకు తల్లియే ఆధారం అవుతుంది. ఆమె స్తన్యమిచ్చి అడుగడుగునా ఆ శిశువు అవసరాలను తీరుస్తుంది. స్త్రీరూపంలో తల్లి అప్పుడప్పుడు చిత్ర విచిత్రములైన అనుగ్రహములను కురిపించక పోతే మానవుడే కాక ఏ ప్రాణీ ఈ విశ్వబ్రహ్మాండంలో ఎక్కడా కనిపించదు. అందువలన ఆమె జీవనాన్ని ఇచ్చే బ్రహ్మచేతనగా అభినందింపబడుతుంది. వేదమాతగా, దేవమాతగా, విశ్వమాతగా ఈ ముగ్గురు దేవతలుగా అర్పించబడుచున్న శక్తి మహిళ.

మానవునిలోనే కాక ప్రతిభావంతులైన ప్రాణులలో కూడ దేవతలూ దానవులూ ఉంటారు. వారిద్దరూ దితికి, అదితికీ జన్మించారని కథ ఉన్నది. సృష్టి శక్తిగా ఈ ప్రపంచంలో శక్తివంతమూ, సంపన్నమూ, విజ్ఞతాయుతమూ, సుందరము అయిన అన్నిటిలోనూ నారీ తత్వానికి ప్రముఖ పాత్ర ఉన్నది. అందువలన ఆమె ప్రత్యేకతకు వివిధ రూపాలలో వేలాది నమస్కారాలు చేయడం జరుగుతుంది. సరస్వతి, లక్ష్మి, కాళి రూపాల్లో విజ్ఞానంగా, గాయత్రి, సావిత్రి రూపాలలో జ్ఞాన చేతనంగా ఆమె ప్రత్యేక పూజలు అందుకుంటుంది.

దేవత్వ ప్రతీకలలో ప్రథమ స్థానం స్త్రీది. రెండవ స్థానం పురుషునిది. లక్ష్మీ–నారాయణులు, ఉమా–మహేశ్వరులు, శచీ–పురందరులు, సీతా–రాములు, రాధా–కృష్ణులు వంటి దేవతల జంటలలో మొదట స్త్రీ, తరువాత పురుషుడు ఉన్నారు. తల్లి శరీరం, సంస్కారం కలసి శిశువు ఈ ప్రపంచంలోకి ప్రవేశిస్తాడు, మానవిగా కనిపిస్తున్నా ఆమె వాస్తవానికి దేవత. ఆమె పేరుతో పాటు దేవీ అనే పదం జోడింపబడి ఉంటుంది. శ్రేష్ఠమైనదిగా, గొప్పదిగా ఆమెను అంగీకరించాలి. భావసంవేదన, ధర్మధారణ, సేవాసాధనల రూపంలో ఆమె శ్రేష్ఠత చరితార్థమవుతుంది.

భర్త, సోదరుల నుండి, పుత్రుని వరకు అందరికీ వారి అభిరుచికీ, అవసరాలకు అనుగుణంగా ఆమె వివిధ రూపాలలో సుఖ సంతోషాలను అందిస్తుంది. ఆచరణ ఆమెనుండి సంతోషం, సంతృప్తి, శాంతి అనుభవంలోకి వస్తాయి. ఆధ్యాత్మిక రంగంలో ఆమెయే భక్తి, శక్తి సమృద్ధి. ఆమెలోని అణువణువు రసాత్మకమైనది. నరుడు ఆమెను పొంది ధన్యుడయ్యాడు. అనేక సామర్థ్యములు చూపడంలో సమర్థుడయ్యాడు. అవ్యాజమైన ఈ దయకు అతని అణువణువులో కృతజ్ఞత, శ్రద్ధ, ఆరాధనా భావం పొంగుతూ ఉండాలి. ఈ కామధేనువు అనుగ్రహాన్ని పొందడంలో ఎంత సఫలుడయితే అంతగా ప్రతిభ, సంపద, సమర్థత, ప్రగతిశీలతల వంటి వరములతో అతడు లాభాన్వితుడు అవుతాడు. తత్వవేత్తలు అనాదికాలం నుండి స్త్రీ విలువను అదేవిధంగా అంచనా వేస్తూ వచ్చారు. ఆమెను అభ్యర్థించమని ప్రతివ్యక్తికీ ప్రేరణ ఇస్తూ వచ్చారు. శక్తిపూజా విధానం మొత్తం ఈ అభిప్రాయాన్నే మనస్సులో నింపుతుంది.

వికాసరంగంలో ప్రతి ఒక్కరూ ఈమె వివిధ రూపాలను సాధన చేయవలసి వచ్చింది. శ్రద్ధ, ప్రజ్ఞ, నిష్ఠ, సామర్థ్యం, కళ, నేర్పు, దూరదృష్టి – ఇవన్నీ ఆ మహాశక్తి సూక్ష్మస్వరూపాలు. 'సాధనద్వారా సిద్ధి' అనే

సాంప్రదాయం ఈ రూపాలుగా ప్రకటితమౌతున్నది. సభ్యత, విజ్ఞతలు ప్రపంచంలో వెల్లివిరిసిన యుగాలలో ఆమె గౌరవ గరిమలకు తగినవిధంగా ప్రజలంతా ఆమెను నిండు మనసుతో సమాదరించేవారు, ఫలితంగా – అంతటా సుఖ శాంతులతో నిండిన సత్యయుగ వాతావరణం కానవచ్చేది.

# మహిళకు గడ్డు రోజులు

అప్పుడప్పుడు దారి తప్పే చెడ్డరోజులు వస్తాయి. అవి తమ స్వభావానికి అనుగుణంగా అవి బాధలు పెడతాయి. మధ్యకాలపు ఫ్యూడల్ అంధకారయుగంలో అంతా తల్లక్రిందులయ్యే అనర్థం ఏర్పడింది. తలక్రిందకి, కాళ్ళుపైకి పెట్టడం లాంటి విచిత్రమైన దృశ్యాలు చూడవలసి వచ్చింది. స్త్రీలోని మూలశక్తిని, ఆత్మను కామినిగా, రమణిగా, భోగవస్తువుగా, దాసిగా పరిగణించేవారు. తిరస్కారం, దోపిడీ, అణచి వేత, భయం వెన్నాడితే ప్రతి విభూతి దురవస్థలపాలు కావలసి వస్తుంది. స్త్రీ విషయంలో అలాగే జరిగింది. ఆమెపట్ల పూజ్యభావం చెడుదృష్టిగా మారింది. ఆమెను వాంఛ అనే అగ్నిలో పడవేశారు. కల్పవృక్షాన్ని నల్లని బొగ్గుగా మార్చివేశారు.

మధ్యయుగంలో స్త్రీపై జరిగిన అత్యాచారాల గాథ ఒక కరుణామయగాథ. మనిషి జన్మకు, పశువు జన్మకు మధ్య జన్మగా ఆమెను పరిగణించారు. మానవోచితమైన అధికారముల నుండి ఆమెను తొలగించారు. పంజరంలో పక్షిలాగా, ఇంటి నాలుగుగోడల మధ్య బంధించారు. ఆడపిల్ల పుట్టడం దురదృష్టానికి సూచనగాను, పుత్రుడు జన్మిస్తే రత్నాల వర్షంలా అదృష్ట సూచనగాను భావించసాగారు. మగపిల్లలకూ, ఆడపిల్లలకూ మధ్య దారుణమైన విచక్షణ చూపేవారు.

చదువు, గారాబం, సౌకర్యాలు, సాధనాలు అందించడంలో ఇద్దరి మధ్య ఘోరమైన హెచ్చు తగ్గులు పాటించేవారు. సంరక్షకులే అలా అన్యాయంగా ప్రవర్తిస్తే, ఇక బయట ఆమెను ఆదరించేవారెవరుంటారు? అత్తవారింటికి చేరగానే ఆమెను వంటమనిషిగా, కాపలామనిషిగా, చాకలిగా, పనిమనిషిగా, భోగవస్తువుగా మార్చేవారు. రెండవ తరగతి పౌరునిగా ఆమెను పరిగణించారు. అన్యాయాన్ని ఖండిస్తూ నోరు మెదపకుండా చేశారు.

ఇద్దరికీ వేరు వేరు ఆచారాలు – కట్టుబాట్లు సాగాయి, స్త్రీకి పాతివ్రత్యం తప్పనిసరి. పురుషునికి పత్నీవ్రత బంధనం లేదు. స్త్రీ ముసుగు వేసుకోవాలి. పురుషుడు ఏ ముసుగు లేకుండా స్వేచ్ఛగాతిరగవచ్చు. వితంతువుకు అనేక నిర్బంధాలు, విధురునికి అనేక వివాహాలు చేసికొనే స్వాతంత్ర్యం. వివాహంలో అమ్మాయికి కట్నం తక్కువైతే పీడించడం. తొందరగా పిల్లలు పుట్టకపోతే రెండవ పెళ్ళికి సిద్ధమవడం, ఆర్థికంగా వికలాంగిని చేయడం, పౌరహక్కులను హరించడం ఇలాంటి న్యాయాలతో స్త్రీని అడుగడుగునా బాధించడం జరిగేది. ఫలితంగా ఆమె క్రమంగా తన ప్రత్యేకతలన్నిటినీ కోల్పోయింది. రూపం, సౌందర్యం ఉన్న వారిని ఇష్టపడేవారు. సగటు స్థాయిలో సాధారణంగా ఉన్నవారిని కురూపులని చెప్పేవారు. వారికి వివాహానికి వరుణ్ణి వెతకడం కష్టమౌతుంది. అలాంటి అనేక దారుణాలపై దృష్టి సారించినట్లయితే ఒక వర్గం మరొక వర్గంపై ఎన్ని నిర్బంధాలు, అనాచారాలు రుద్దిందో తెలుస్తుంది. స్త్రీ ప్రగతి ద్వారాలన్నీ మూసివేయబడ్డాయి.

భారతదేశంలాంటి వెనుకబడిన దేశాలలో స్త్రీకి, ఇలాంటి సమస్యలు ఎన్నో ఉన్నాయి. సంపన్న దేశాలనబడే దేశాలలో మరొక రకం సమస్యలు ఉన్నాయి. ప్రపంచంలోని సగం జనాభా ఇలాటి కష్టాలను ఎదుర్కోవలసి

వస్తున్నది. వాటిని తొలగిస్తే స్త్రీ పురుషునికి గొప్ప సహాయకురాలుగా ఉండేది. కానీ సగం జనాభాను పక్షవాతంతో బాధపడుతున్నదానిలా, అవిటిగా చేతులు కట్టుకొని ఎప్పుడూ మూలుగుతూ విలపిస్తూ ఉండేట్లుగా చేసే దౌర్భాగ్యాన్ని ఏమనాలి? కట్టి వేసి కాలరాచే విధానానికి ప్రతిక్రియ జరిగితీరుతుంది. కట్టేసేవాడు కూడా చెడు పనులకు శిక్ష అనుభవించవలసి వచ్చింది. పురుషుడు తన భాగస్వామిని అసమర్థురాలుగా చేస్తే, పురుషుడు ఆమె భారాన్ని తాను మోయవలసివస్తుంది. ఒకటి ప్రక్కన మరొక ఒకటి ఉంచితే పదకొండు (11) అవుతుంది అనేటంతటి సహృదయత ఎక్కడ ఉంది? ఒకటి క్రిందగానీ, పైనగానీ మరొక ఒకటి వేసి తీసేస్తే సున్నాయే (0) మిగులుతుంది. వెనుకపడ్డతనంతో పీడితులైన (స్త్రీ, పురుషులు) ఇద్దరూ సున్నాలాంటి దయనీయ పరిస్థితిలో నేడు ఉండవలసివస్తున్నది.

# ముంచుకువస్తూన్న పరివర్తన తుఫాను

సృష్టికర్తకు ఔచిత్యం, సమతూకం ఇష్టం. అతడు పొగరుబోతుతనాన్ని దీర్ఘకాలం సహించడు. అవాంఛనీయత ఫలించి పుష్పించే స్థితిలో చాలా కాలం ఉండదు. సమతుల్యవ్యవస్థ తన పద్ధతిలో తన సమయానికి, తన సంస్కరణా క్రమాన్ని చూపుతుంది. అది ఎల్లప్పుడు తలక్రిందులుగా ఉన్నదానిని తారుమారు చేసి సరిచేసింది. మంచి వ్యవస్థ ప్రాణశక్తి కలిగి ఉండేటట్లు గట్టి ప్రయత్నం చేసింది. అవినీతి అనే రాక్షసత్వం అప్పుడప్పుడు తలెత్తింది. కానీ దాని బాధ ఎల్లవేళలా స్థిరంగా లేదు. పుట్టగొడుగులకు దీర్ఘాయువు ఉండదు. అజ్ఞానం, అసమానత కొద్ది కాలంలోనే ఔచిత్యం ముందు ఓటమిని అంగీకరించవలసి వచ్చింది.

ఈ రోజులలో కొంత వరకు అలాటి పరివర్తనలే జరుగుతున్నాయి.

ఫ్యూడల్ వ్యవస్థ నేల కూలింది. రాజకిరీటాలు మచ్చలు పడి దుమ్ముకొట్టుకొని కనిపిస్తున్నాయి. జమీందారుల, మోతుబరుల పలుకుబడి సమాప్తమయింది. ఇప్పుడు దాస దాసీలను అమ్మడం – కొనడం అనే పద్ధతి ఎక్కడుంది? వందలమంది ఉంపుడు కత్తెలు ఉండే జమానాలు ఇప్పుడు లేవు. సతీసహగమనం ఇప్పుడు ఎక్కడ ఉంది? కొన్ని దశాబ్దాలక్రితం సాగింది. ఇప్పుడు ఎంతో మార్పు వచ్చింది. ఆశ్చర్యకరమైన పరివర్తనల క్రమంలో ఒక్కొక్కటి ఇప్పుడు అమలు జరుగుతోంది. రాజకీయ, సామాజిక, ఉద్యమాల క్రమం ఇప్పటికీ ఆగలేదు. దీనిలో మానవత్వపు గరిమ కూడ కలసి ఉంది. కానీ కొద్దిరోజులలోనే ఇన్ని రంగాలలో ఇంతగొప్ప తారుమారు జరగడం వెనుక సృష్టికర్త క్రమశిక్షణకు కూడా తక్కువ విలువ ఇవ్వకూడదు. తుఫాను తాకిడికి ఇసుక గుట్టలు ఎగిరి ఎక్కడికో చేరతాయి. సుడిగాలిలో ఆకులు, గడ్డిపోచలు ఆకాశాన్ని అంటుతూ కనిపిస్తాయి. సామర్థ్యంతో అసమర్థత కలిస్తే వచ్చిన పరిణామం ఇది.

21వ శతాబ్దం గొప్ప పరివర్తనల సమయం. దీనికి ముందటి 12 సంవత్సరాలు యుగసంధి. ఈ యుగసంధి సమయంలో సూక్ష్మ జగత్తు వ్యవస్థ చాలా పెద్ద మార్పులకు రూపు రేఖలను దిద్దుతున్నది. గొప్ప ఆకాంక్షలతో కూడిన ప్రణాళికలను నిర్మాణం చేస్తున్నది. దానిలక్ష్యం సత్యయుగం తిరిగి రావడం. ఋషి పరంపరలు, దేవ పరంపరలు, మహామానవుల దృష్టికోణాలు, ఈ సమయంలో క్రియాన్వితం కాబోతున్నాయి. అంతటా వ్యాపించిన అంధకారం చరమదశకు చేరుతున్నది. ఉషోదయం ప్రారంభం అవుతోంది. అరుణోదయం జరగబోతున్నది, ఈ ప్రభాతోత్సవంలో అంతా మారుతుంది, సంస్కరింపబడుతుంది. ఈ సందర్భంలోనే స్త్రీ కోల్పోయిన వర్చస్సు ఆమెకు

తిరిగి లభించితీరే ఒక పెద్ద ప్రణాళిక అమలు కాబోతున్నది. ఆమె స్వయంగా లేస్తుంది. అవాంఛనీయతలు అనే బంధనాలనుండి విముక్తురాలవుతుంది. తమ సముదాయానికి, సమాజానికి సమస్త ప్రపంచానికీ న్యాయం చేకూర్చే విధంగా, ఉజ్వల భవిష్యత్తుకు ప్రోత్సాహం కల్పించేందుకు సమర్థురాలు అవుతుంది. 21వ శతాబ్ధం నారీ శతాబ్దం అనే పేరుతో ప్రసిద్ధి చెందుతుంది. మహిళ మేలుకొంటుంది. తన సామర్థ్యాన్ని ప్రదర్శిస్తుంది.

గత కాలపు స్త్రీ రత్నాలను స్మరించితే ఆ సమయం తిరిగివస్తే ఎంత బాగుండును అనిపిస్తుంది. కుంతీదేవి ఐదుగురు దేవపుత్రులను కన్నది. మదాలస యోగి పుత్రులకు, గంగ వసువులకు జన్మనిచ్చింది. సీత ఒడిలో లవకుశులు ఆడుకున్నారు. శకుంతల ఆశ్రమంలో ఉండి భరత చక్రవర్తిని తీర్చిదిద్దింది. అనసూయ ముంగిట్లో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు బాలురుగా మారి ఆడుకున్నారు. వారే మందాకినిని స్వర్గం నుండి చిత్రకూటంలోకి దించారు. అరుంధతి మొదలగు సప్త ఋషుల ధర్మపత్నులు తమ భర్తల తపశ్చర్యను ఎక్కువ సఫలం, సమర్థవంతం చేయడంలో ఆప్తమిత్రుల పాత్ర నిర్వహించారు. మనువు ప్రతిభను వికసింపజేయడంలో శతరూప అసాధారణమైన సహకారం అందించింది. ఇల తన తండ్రి జరిపే కార్యక్రమాలలో పురోహితుని పాత్రను నిర్వహించేది. వేదమంత్రముల ప్రకటీకరణలో ఋషుల వలె ఋషీమణులు తమ విద్వత్తును చూపారు. దశరథుడు దేవతలకు సహాయం చేయడం కోసం భార్యతో సహా పోరాడటానికి వెళ్ళాడు.

మధ్య యుగంలో ఝాన్సీ లక్ష్మీబాయి స్త్రీలతో విశాల సైన్యాన్ని తయారు చేసి ఒక సాటిలేని ఉదాహరణను చూపింది. స్వాతంత్ర్య పోరాటంలో మహిళావర్గం ఇచ్చిన సమర్థవంతమైన సహకారం చూసి

ప్రపంచంలోని మనీషులు ఆశ్చర్య చకితులు అయినారు. పురుష పుంగవుల ప్రతిభకు వారి ప్రతిభ ఏమాత్రం తీసిపోదు. భారతదేశ చరిత్ర అలాంటి స్త్రీల వ్యక్తిత్వంతో, నాయకత్వంతో నిండి వున్నది. ఆ చరిత్రపై దృష్టి సారించినట్లయితే, ఆ కాలపు స్త్రీజాతి ఎంత సమర్థవంతమైనదో, ఎన్నెన్ని విజయాలు సాధించిందో తెలుస్తుంది.

# క్రొత్త శతాబ్దం మహిళా శతాబ్దం

అంధకారయుగం నుండి వెలికి వచ్చిన అనేక సత్ప్రవృత్తుల వలె మహిళ ఇప్పుడు క్రొత్తరీతిలో తన వర్చస్సును చూపడానికి ముందుకు వస్తున్నది. ఇది కల్పన కాదు. నిర్ణయమైన భవిష్యత్తు.

విదేశాలలో ఈ క్రమం ముందునుండే సాగింది. ప్రగతి పొందిన దేశాలలో పురుషులు తమ పురుషార్థాన్ని చూపే రంగాలన్నిటిలోనూ మహిళ ప్రవేశించింది. అమెరికా, జపాన్, జర్మనీ, రష్యా మొదలగు దేశాల స్త్రీలు రాజకీయాల నుండి వైజ్ఞానిక, ఆర్థిక రంగాల వరకు – అన్ని రంగాలలో సంచలనాత్మక కార్యాలు చేస్తున్నారు. వారి సమాజసేవ ముక్తకంఠంతో పొగడదగినదిగా ఉన్నది. మాంటిసోరి విద్య, ఫ్లోరెన్స్ నైటింగేల్ రెడ్‌క్రాస్ ఉద్యమం, మేడమ్ క్యూరీ వైజ్ఞానిక పరిశోధన, మదర్ థెరిస్సాకు దరిద్రుల యెడల గల కరుణ, మేరీ స్టోప్స్ 'కుటుంబ నియంత్రణ కార్యక్రమం' చిరస్మరణీయంగా ఉండే ఘన విజయాలు. రాజకీయ రంగంలో ఇందిరాగాంధీ, గోల్డామేయర్, మార్గరెట్ థాచర్, భండార్ నాయకి, కోవా ఎక్వీనో మొదలగువారి పేర్లను ప్రతి ఒక్కరూ తలుచుకుంటారు. బెనజీర్ భుట్టో పాకిస్థాన్‌లో హెరాయిన్ స్మగ్లర్లపై తన పద్ధతిలో యుద్ధం జరిపింది. జపాన్‌లో ఈ సంవత్సరం ఒక అద్భుతం జరిగింది. అక్కడి టాకోకాడోయీ అనే ఒక మహిళ ముందు టోక్యో

అసెంబ్లీలో ఎన్నికలలోనూ, తరువాత మొత్తం జపాన్ ఎన్నికలలోనూ మహిళా ప్రధాన ప్రజాతంత్ర పార్టీకి మెజారిటీ ఇప్పించి ప్రజల మనస్సులపై చెరగని ముద్ర వేసింది. ప్రపంచమంతటా స్త్రీలు ఏవిధంగానూ తమపై 'వెనుక పడ్డవారు' అనే ఆరోపణ చేయడానికి వీలులేకుండా తమ వర్చస్సును వెలుగులోకి తెచ్చి చూపుతున్నారు.

ఇదంతా ఈ రోజులలోనే ఈ శతాబ్దంలోనే సాధ్యం అయింది. ఇప్పుడు ఈ పొంగు ఇంకా ఉప్పొంగే అవకాశం పూర్తిగా ఉన్నది. దీని లక్షణాలు అడుగడుగునా ఋజువులతో సహా ఎదురవుతున్నాయి. భారతదేశపు ఒక చిన్న ప్రాంతం కేరళను ఇందుకు ఉదాహరణగా తీసుకోవచ్చు. అక్కడి బాలికలు విద్యారంగంలో ముందంజ వేసి ఇతర ప్రాంతాలను వెనుకకు నెట్టారు. పాఠశాలలో ప్రవేశం పొందిన తరువాత గ్రాడ్యుయేట్ అయ్యేవరకు బాలికలెవరూ చదువు ఆపరు. అంతేకాక అనేక రంగాలలో యోగ్యతను పెంచుకొనే క్రమాన్ని వారు కొనసాగిస్తున్నారు. 26-27 సంవత్సరాల కంటే తక్కువ వయసుగల స్త్రీ, 29 సంవత్సరాలకంటే తక్కువ వయసుగల పురుషుడు వివాహం చేసికోకూడదు అనే చట్టాన్ని స్త్రీలు ప్రభుత్వం ద్వారా ఆమోదింపజేశారు. ఈ ప్రయత్నాల వలన మూడు సత్ఫలితాలు ఏర్పడ్డాయి. మొదటిది ప్రగతి పథంలో అడుగడుగునా ఆటంకం కల్పించే జనాభా పెరుగుదల ఆగిపోయింది. రెండవది అక్కడి చదువుకొనినవారు దేశ విదేశాలలో బ్రతుకుదెరువు పొందడంలో ఆశ్చర్యకరమైన సఫలత పొందారు. మూడవది - ప్రాంత సంపదలో గణనీయమైన అభివృద్ధి జరిగింది. ఫలితంగా ఆహారపదార్థాల నేరస్థుల సంఖ్య నామమాత్రంగా ఉండి పోయింది. ఈ అన్ని విషయాలలో స్త్రీల వ్యక్తిగత ఉత్సాహం ప్రముఖ పాత్ర వహించింది. పురుషులు కూడా వారిమార్గంలో పెద్ద అవరోధాలు

ఏవీ ఏర్పరచలేదు. కేరళకు చెందిన ఒక మహిళ అమెరికా సేనా విభాగంలో చాలా ఉన్నత పదవిలో ఉన్నది.

ఇది మహిళల ప్రగతికి ఒక చిన్న మచ్చుతునక మాత్రమే. ప్రపంచయాత్రకు బయలుదేరి నట్లయితే అనేక దేశాలలో, అనేక రంగాలలో క్రొత్త ఉత్సాహం ఉప్పొంగిందనీ, మహిళల ప్రగతి పథం ఇక ఆగదని, స్త్రీ పురుషులు సమానులు కావాలనే లక్ష్యం పూర్తి అయితీరుతుందనీ మనం నిర్ణయిస్తాము.

# భారత్ అగ్రగామిగా ఉండేది, ఉంటుంది

భారతదేశం ఈ దిశలో ఇంకా చాలా చేయవలసి ఉన్నది. ఈ దేశపు సంఘమిత్ర, ఆమ్రపాలి తమ సదుపాయములను కాలదన్ని లోక కళ్యాణం కోసం బయలుదేరారు. ప్రపంచమంతటా బౌద్ధమతాల స్థాపనలో, విస్తరణలో అసాధారణ రీతిలో సఫలురయ్యారు. అలాంటి దేశంలో నేడు స్త్రీ వెనుకబడి ఉన్నది. పల్లె ప్రాంతాలలో స్త్రీ విద్య, స్త్రీల సామాజిక స్థితి దయనీయంగా కనిపిస్తోంది. అయినప్పటికీ ఈ వెనుకబడ్డ రంగంలో అద్భుతాలు చూపడానికి పరివర్తన ప్రక్రియ నడుం బిగిస్తున్నది. ప్రగతి పథంలో నవోత్సాహం పెల్లుబుకుతున్నది.

భారతదేశంలో పంచాయితీ రాజ్య స్థాపనకు భూమిక తయారయింది. దానితోపాటు సర్పంచ్‌లలో 30 శాతం మహిళలు ఉండాలనే నిర్ణయం కూడా జరిగింది. ఈ రిజర్వేషన్ ప్రాంతీయ స్థాయికీ, జాతీయ స్థాయికీ విస్తరిస్తుందని ఆశించబడుతోంది. ఈ రిజర్వేషన్ ఇతర భాగాలకూ, పదవులకూ విస్తరిస్తుంది. ఇది యుగం పిలుపు. దీన్ని ఎవ్వరూ అడ్డుకోలేరు.

పరిపాలనా రంగాలలో ప్రవేశం పొందడంతో ప్రారంభమయినప్పటికీ, ప్రగతి క్రమం అంత చిన్న పరిధికి పరిమితం కాదు. మహిళల విలువ గుర్తించబడిందనీ, ఆమె గౌరవించబడుతోందనీ చూపడానికి ఇది ఒక గుర్తు మాత్రమే. సంస్కరించడానికి ఇంకా అనేక రంగాలు సిద్ధంగా ఉన్నాయి. వాటిని మెరుగుపరచే బాధ్యత మహిళ భుజస్కంధాలపై మరింతగా పడుతూన్నది. సహకారం విలువ తెలుస్తున్నది. కాలు పట్టుకొని వెనక్కులాగే వికృతమైన క్రీడ ప్రతి ఒక్కరికీ హానికరము, కష్టదాయకమే అవుతుంది.

రాబోయే రోజులలో స్త్రీ స్వాభావికంగా అధిక సమర్థురాలు, నేర్పరి, మంచి సంస్కారవంతురాలు కాబోతున్నది. ఇది ఆమె నవ జీవనానికి బంగారు ఘడియ. వర్ష ఋతువు వస్తే పచ్చదనం కనిపించకపోవడం అసంభవము. వసంతం ప్రవేశముతో వృక్షాలపై రంగురంగుల పూవులు వికసించక పోవడం జరగనిపని. ప్రొద్దు పొడిచిన తర్వాత అంధకారం, నిశ్శబ్దం కొనసాగడం జరుగదు. భూమికి దేవత అయిన మహిళ తన గొప్పతనాన్ని అణచుకొని త్రొక్కిపెట్టి కూర్చొనే ఆపద ఎప్పటి వరకూ సాగగలదు? సమర్థతతోపాటు విజ్ఞత కూడా పెరుగుతుంది. అదృశ్య శక్తి మార్గదర్శనంలో అభ్యుదయ పథంలో మహిళ ముందుకు సాగుతున్నప్పుడు, అందువల్ల జరిగే అద్భుతాలను ఆపడం ఎవరికి సాధ్యం?

మహిళ ఇచ్చే వరాలు ఎప్పుడూ అల్పస్థాయికి చెంది ఉండవు. ఆమె భూమితో, శక్తితో, వర్షంతో ప్రాణవాయువుతో సమానంగా తన మహిమల కుంభవృష్టితో ప్రపంచంలోని అణువణువునూ మనోహరంగా, రసవత్తరంగా, సమున్నతంగా తీర్చిదిద్దింది. కరుణ, దయ, సేవ – ఇవన్నీ ఆమె సమర్పణ, ఆమె దయ మాత్రమే. అవే ఈ ప్రపంచాన్ని రమ్యంగా,

సంస్కారవంతంగా నిలిపి ఉంచుతున్నాయి. రాబోయే రోజులలో ఆమె తన గొప్పతనాన్ని మరింతగా పెంచి చూపవలసి ఉన్నది. ప్రతికూలతను అనుకూలతగా, పతనాన్ని ఉన్నతిగా మార్చి సమస్యలకు పరిష్కారం చూపడంలో ఆమె మహత్తర పాత్ర వహించబోతోంది.

ఇదంతా సులభంగా జరిగే పనికాదు. నియతి ఏదైనప్పటికీ, దానికోసం శక్తిని ఉపయోగించాలి. బుద్ధుడు, గాంధీ వంటి దేవాత్మలు లోకకళ్యాణం కోసం అవతరించారు. కానీ ఆ లక్ష్యం సులభంగా పూర్తి కాలేదు. వారు తామూ, తమ సహచరులూ నిర్ణీత లక్ష్యాన్ని చేరడానికి త్యాగంతో, సాహసంతో ప్రయత్నాలు చేయవలసి వచ్చింది. హనుమంతుడు, అర్జునుడు మహాప్రతాపవంతులు కావడానికి జన్మించారు. వారికి దైవానుగ్రహం కూడా పెద్ద యెత్తున లభించింది. అయినా వారు తమ సహచరులతో సహా అసాధరణమైన కార్యశూరతను చూపవలసి వచ్చింది. ఎదురుగా కంచంలో పెట్టిన అన్నం తనంతట తాను నోట్లోకి వెళ్లి పొట్టలో పడి ఆకలిని తీర్చడం సులువుగా జరగదు. అలాంటిది యుగావతరణకోసం జరుగబోయే మహిళా పునరుద్ధరణకు తగిన మూల్యం చెల్లించవలసివస్తే అందులో ఆశ్చర్యం యేముంది?

ప్రత్యక్షంగా అయితే విద్య - స్వావలంబన, కుటుంబ పోషణ, కళాకౌశలం లాంటి రంగాలలో మేధావులు మహిళకు సహకారం అందిస్తే సరిపోతుంది. ప్రభుత్వం సహకారం అందిస్తున్నది. మహిళలు ఉద్యోగాలలో ప్రవేశిస్తున్నారు. ఈ లక్ష్యములకు ప్రగతి అనే పేరు కూడా లభిస్తున్నది. అయినప్పటికీ ఒక పెద్ద ఆటంకం ఎదురవుతున్నది. ఆచారాల రూపంలో అదృశ్యంగా ఉంటూ కూడా అది ఎంతో అనర్థం తెచ్చిపెడుతోంది. దానితో పోల్చి చూస్తే కంటికి కనిపించే అభివృద్ధి కృషి ఫలితం అంతంతమాత్రమే అనిపిస్తుంది.

# ఇంకానా ఈ బంధనాలు?

ప్రజల మనస్సులలో మహిళపట్ల విపరీతమైన భ్రమలు, మూఢ నమ్మకాలు వేళ్ళూనుకున్నాయి. చేతికి చేయి కనిపించని దట్టమైన పొగమంచులా ఉన్నాయి అవన్నీ. దుర్బుద్ధి, విజ్ఞత అనిపిస్తోంది. మార్పు ఈ రంగంలో తేవలసిన అవసరం ఉంది. నమ్మకాలకు అనుగుణంగా ఆలోచనా ప్రవాహం సాగుతుంది. దానినిబట్టి కార్యకలాపాలు, ఆచారాలు వ్యవహారాల క్రమం నిర్ణయం అవుతుంది. ఒకనాడు మహిళల ప్రాధాన్యం శిరోధార్యం అయింది. మానవ రూపంలో ఉన్న దేవతగా ఆమెను పరిగణించారు. అప్పుడు ఆమె తన సామర్థ్యాలను వెలికితెచ్చి, సమస్త మానవజాతికీ అన్ని విధాలా మేలు చేసింది. కుటుంబాలను నరరత్నాల గనులుగా తయారు చేసింది. కానీ ఆ తర్వాత ఆమెను ఆ ఉన్నత పదవినుండి తొలగించి పెంపుడు పశువుతో సమానంగా భావించారు. అందువల్ల ఆమె అశక్తురాలు, రక్షణలేనిది, పరాధీన కావడం సహజమే.

నేడు మహిళపట్ల గల దృక్పథం అలాగే ఉంది. సంరక్షకులు ఆమెను పరాయి ఇంటి చెత్తగా భావించి అశ్రద్ధ చేస్తున్నారు. బాలికలను చిన్న చూపు చూస్తున్నారు. భర్త దృష్టిలో ఆమె కామాగ్నిని చల్లార్చుకోవడానికి కొనుక్కోబడిన ఒక సాధనం. ఆమెను కామినిగా, రమణిగా, భోగవస్తువుగా పరిగణిస్తున్నారు. సంతానపు పెను భారాన్ని మోసేటట్లు చేశారు. అత్తవారింట్లో కుటుంబం అంతటి దృష్టిలో ఆమె కేవలం ఒక దాసి మాత్రమే. ఆమె పగలు రాత్రి పనిలో నిమగ్నమై ఉంటోంది. ఆమె దానికి బదులు ఏ విధమైన అధికారంగానీ, గౌరవంగానీ పొందే ఏ అర్హతా ఆమెకు ఉండడం లేదు. ఈ నిర్బంధిత పరిస్థితులలో ఎవరైనా తమ ప్రతిభను కోల్పోవడం సహజమే. అదే జరిగింది. నీచ మనస్తత్వం ఆమె

శ్రేష్ఠతను హరించింది. ఆమెను అసహాయురాలుగా, అసమర్థురాలుగా చేసింది. అలాటి పరిస్థితిలో ఆమె ప్రతిభ పతనంకావడం సహజమే. సగం జనాభాను అలాటి దయనీయ స్థితిలో పడవేసినప్పుడు, పురుషుడు కూడా నష్టపోక తప్పదు. మొత్తం ప్రపంచం ఆమె గొప్పతనంవల్ల కలిగే అనేక ప్రయోజనాలను కోల్పోవలసి వస్తున్నది. ప్రత్యేకించి భారతదేశంలాంటి వెనుకబడ్డ దేశపు ప్రజలకు ఇలా నిరంతరం నష్టపోతూ ఉండడం చాలా బాధాకరం అవుతోంది.

న్యాయంకోసం, సముచిత స్థానంకోసం సంఘర్షణ జరుగుతూన్న ఈ యుగంలో స్త్రీ యథాస్థితిలో ఉండడం జరుగదు. కాలం అనేక సందర్భాలలో అనేక స్థాయిలలో మార్పులు తప్పనిసరి అయేటట్లు చేసింది. ఆ ప్రవాహం స్త్రీని యథాస్థితిలో పడిఉండనివ్వదు. ఈ మార్పు, ఈ అభివృద్ధి మహిళల హక్కులను చట్ట బద్ధం చేయడంతో ప్రారంభమయింది, అది సామాజిక రంగంలో మహిళకు తగిన న్యాయం లభించే అవకాశాన్ని ఇచ్చింది. పంచాయతీ ఎన్నికలలో ఆమెకు 30శాతం స్థానాలు కేటాయించబడ్డాయి. ఈ కేటాయింపు ఇకముందు ప్రాంత, కేంద్ర శాసనసభలలో కూడా లభించవచ్చు. ఇందువల్ల ఉప్పొంగిన ఉత్సాహం స్త్రీ పురుషులను ఇద్దరినీ ప్రభావితం చేసింది. తాను అన్నివిధాల శాసించబడే స్థితిలోనే ఎందుకు ఉండిపోవాలి అని స్త్రీ ఆలోచిస్తోంది. తనకు పరిపాలనలో భాగస్వామి అయ్యే అవకాశం లభించినపుడు దానిని ఎందుకు వదులు కోవాలి అని ఆమె ప్రశ్నిస్తోంది. భవిష్యత్తులో తన వర్గానికి ఉన్నతాధికారాలు ఇప్పించే ఆలోచన ఎందుకు చేయకూడదని ఆమె అడుగుతోంది. పురుషులు కూడా తమ కుటుంబ సభ్యులెవరైనా పరిపాలనలో భాగస్వాములయితే తద్వారా మొత్తం కుటుంబానికి గౌరవం, అధికారం పెరుగుతాయని ఆలోచిస్తారు. గౌరవం, ప్రయోజనం లభించే

అవకాశం ఉన్నపుడు దేనికైనా సహజంగా అంగీకారం అందుతుందికదా. ప్రస్తుత సంస్కరణకు అందరూ స్వాగతమే పలుకుతున్నారు. మహిళలు సామాన్య ప్రజలదృష్టిలో గొప్ప వాళ్ళుగా భావింపబడడానికీ, వారికి ఓటు వేయడంలో సఫలత లభించడానికీ దోహదం చేసే ప్రయత్నాలు జరగాలి.

# ఎన్నాళ్లీ బానిస బ్రతుకు?

వాస్తవానికి వెనుకబడ్డవారిని పైకి లేపి సమత్వపు స్థితిని కలిగించడానికి దైవీ శక్తులు మాట ఇచ్చాయన్నది మహాకాలుని ప్రథమ వాగ్దానం. జనమానసం కూడా కాల ప్రవాహానికి వ్యతిరేకంగా ఉండే మొండి పట్టుదలను ఎక్కువ సేపు నిలుపుకోలేదు. తుఫాను బలమైన చెట్లను కూడా పెరికి అవతల పారేస్తుంది. కుండపోత వర్షంలో ఇళ్ల కప్పులు, గుడిశెలు కొట్టుకుపోవడం కనిపిస్తుంది. నీటి ఒత్తిడి వల్ల పెద్ద పెద్ద ఆనకట్టలలో కూడా పగుళ్ళు ఏర్పడడం, అవి కొట్టుకు పోవడం లాంటి దృశ్యాలు కనిపిస్తాయి. ఇది మహాకాలుని హుంకారమే. ఇది మహిళను వెనుకబడ్డతనం నుండి చేయి పట్టుకుని ముందుకు లాగుతోంది. ఇప్పుడు స్త్రీవిద్య వేగంగా విస్తరించడం నిశ్చయమే, విద్యలో, వ్యవస్థలో పురుషునికి గుత్తాధిపత్యం ఉండదు. స్త్రీ విద్య కోసం కుటుంబము - బంధువులు గుత్తాధిపత్యం మొదలుకొని విద్యాశాఖ వరకు అందరూ తగు ఏర్పాటు చేయవలసిఉంది. స్త్రీవిద్య ఉద్యోగం ఇప్పించడంతో ముగిసిపోకూడదు. దానితో పాటు సమానత్వానికీ ఐకమత్యానికీ ప్రతిరంగంలో సమాన అవకాశాలు పొందే ఏర్పాటు కూడా ఉండాలి. ఈ పని ఉపాధ్యాయినీ, ఉపాధ్యాయులు చేయాలి. లేకపోతే ప్రతిరంగంలో ఉప్పొంగుతున్న ప్రగతిశీలత ఫలితంగా మహిళ గొప్పతనం,

విలువ, అధికారం, భవిష్యత్తు అర్థం చేసికొని, అవినీతి మూలకములైన బంధాలను త్రెంచుకొని స్వతంత్ర వాతావరణంలో గాలిపీల్చుకుని తీరుతుంది. ఇదే లక్ష్యాన్ని యుగ చేతన స్వీకరించింది. స్త్రీ పురుషులు సమానం అనే నినాదాన్ని దశదిశలా ప్రతిధ్వనింపజేసింది.

మహిళ నిస్సహాయంగా అనుచితమైన ఒత్తిడులకులొంగి ఉండే పరిస్థితులు సమాప్తమయ్యాయి. ఇక – ఆడశిశువు జన్మిస్తే ఎవరూ ఏడుస్తూ కనిపించరు, పుత్రుడు జన్మిస్తే ఎక్కడా ఎవరూ అభినందనలు కురిపించరు. ఏది జరిగినా ఇద్దరికీ సమానంగానే జరుగుతుంది. మన ఇంటిపిల్ల పరాయి ఇంటి చెత్త అయితే ఇతరుల ఇళ్ళలోని చెత్త మనింట్లోకి కోడలుగా గృహలక్ష్మి పాత్ర వహించడానికి వచ్చేందుకు సిద్ధంగా ఉంది. అలాంటప్పుడు భేద భావం ఎందుకు? బాలికకూ బాలునికీ మధ్య విచక్షణ ఎందుకు? మగవాడికి ఒక న్యాయం, ఆడదానికి మరో న్యాయం ఎందుకుండాలి?

స్త్రీ పరదాలో, పంజరంలో, బందిఖానాలో ఉండవలసి రావడం ఆమె పరాధీనతకు ఒక చిహ్నం, ఇలా స్త్రీని అసహాయురాలుగా, అనుభవహీనురాలుగా, సేవకురాలుగా తయారు చేస్తున్నారు. అబలగా మారిన ఆమె దురాక్రమణలను సాహసంతో ఎదుర్కోగల్గే ధైర్యాన్ని కూడా కోల్పోయింది. అవసర సమయాలలో తన పిల్లల పొట్టనింపుకోగల్గే స్థితిలో కూడా లేదు ఆమె. వ్యాపారం నడపడం, ఉన్నత పదవుల బాధ్యత వహించటం అలా ఉంచి – సగటు కుటుంబాల వ్యవస్థకు సంబంధించిన అనేక పనులకు – సంత, బజారు, వైద్యశాల ఇతర అనేక కార్యాలయాలకు వెళ్ళటానికి కూడా ఆమె సంకోచంతో, బిడియంతో, భయంతో, మూగ, చెవిటి దానివలె ఉండిపోతోంది. ఈ విధమైన అశక్తతను ఉత్పన్నం చేసే వారు పశ్చాత్తాపంతో తమ చర్యలను వెనక్కి తీసికోవలసి ఉంటుంది.

కుటుంబంలో, బంధువుల మధ్యన స్త్రీ, పురుషులు ఏవిధమైన భయం, బిడియము లేకుండా జీవనయానము చేస్తూ ఉండగల్గితే - విశాల కుటుంబం అయిన సమాజంలో అవసరమైన పనులకు రావటానికి, పోవటానికి ఎవరో సంరక్షకుడిని వెంట తీసుకుపోవలసిన అవసరం ఎందుకుంటుంది?

వివాహాన్ని నిర్ణయించడంలో సంరక్షకుల ఇష్టమే ఎందుకు సాగాలి? మగపిల్లలతో సమానంగా ఆడపిల్లలకు మంచి యోగ్యత సంపాదించడానికి, విద్యాబుద్ధులు పొందేందుకు అవకాశాలు కల్పిస్తే వారిని బాల్యవివాహపు బంధాలతో బంధించి, మరొక పంజరంలోకి మార్చవలసిన అవసరం ఏం ఉంటుంది? వివాహం తరువాత అర్హతలను పెంచుకునే అవకాశాలు ఎందుకు సమాప్తం అయిపోవాలి? పుట్టింట్లో బాలిక సంపాదించిన యోగ్యత, గౌరవాల క్రమాన్ని అభివృద్ధిపరచటంలో అత్తింటివారు ఎందుకు బాధ్యత వహించరు? వివాహిత అయిన తరువాత ప్రగతికి అన్ని అవకాశాలు మూసివేసి,దాసి పాత్ర నిర్వహించేవరకే ఆమె పాత్రను ఎందుకు పరిమితం చెయ్యాలి? ఈ ప్రశ్నలకు సరైన సమాధానం ప్రతి ఆలోచనాపరుడు, న్యాయనిష్టకలవాడు, దూరదృష్టి గల వాడు గుండెమీద చెయ్యి వేసుకొని చెప్పాలి. వారిని ఈ విధంగా అశక్తులను చేస్తే వారు ఎంత బాధ, వేదన అనుభవించవలసి వస్తుందో అందరూ ఆలోచించాలి. ఎక్కువమంది బాలికలు వివాహం తరువాత తమ శారీరక, మానసిక ఆరోగ్యాలను కోల్పోతున్నారు. జీవితఖైదీగా జీవించి ఏదో ఒకవిధంగా రోజులు వెళ్ళదీయడం తప్ప మరే భవిష్యత్తూ కనబడకపోవటమే ఇందుకు కారణం.

# దాంపత్యపు గరిమను మరువకండి

వివాహంలో మూడు ముళ్ళూ వేసి, పాణిగ్రహణ సంస్కారం చేసిన భర్తకు భార్య యోగ్యతను పెంచడానికి విశ్వప్రయత్నం చేయడం కనీస కర్తవ్యం అవుతుంది. ఈ కర్తవ్యాన్ని అతడు ఉపేక్షిస్తే ఆ వివాహాన్ని అపహరణ అని తప్ప ఇంకేమనాలి!

వివాహము వలన కామాగ్నిని చల్లార్చుకొనేందుకు చట్టబద్ధమైన అధికారం లభించవచ్చు. అయితే నీతికి కట్టుబడి ఆ అధికారాన్ని వినియోగించాలి. స్త్రీ పురుష సంగమం ప్రత్యక్ష ప్రతిఫలం సంతానోత్పత్తి. ఒకానొక కాలంలో పశువులను మేపటం, పుల్లలు ఏరటంలాంటి పని బాల్యంలోనే బాలురకు అప్పజెప్పబడేది. వీరు కుటుంబానికి ఆర్థికంగా భారం అయ్యేవారు కారు. కానీ ఇప్పుడు వారిని సభ్యతగల వారుగా పెంచటం, వారికి విద్యాబుద్ధులు నేర్పే ఏర్పాట్లు చేయటం, ఆడుకోడానికి ఇళ్ళలో విశాలమైన స్థలం ఉండటం లాంటి ఎన్నో క్రొత్త ప్రశ్నలు సంతానోత్పత్తితో పాటు జతపడి ఉంటున్నాయి. ఈ మండిపోతున్న ధరల కాలంలో వాటిని నెరవేర్చటం కష్టసాధ్యం అవుతున్నది. పురుషుడు ఇంద్రియ వాంఛ విషయంలో గ్రుడ్డిగా పరిణామం ఆలోచించకుండా వ్యవహరించటం తన ఆర్థిక పరిస్థితిపై, భార్య ఆరోగ్యంపై పిల్లల భవిష్యత్తు పై గొడ్డలిపెట్టు. క్రొత్తగా వచ్చిన శిశువు ఉమ్మడి కుటుంబ సభ్యుల సదుపాయాలలో కోత విధిస్తాడు. ఆపదలతో కూడిన పరిస్థితులతో పెరిగిన బాలకుడు తనకు, సంరక్షకులకు, మొత్తం ప్రపంచానికి శాపం అవుతాడు. ఈ యథార్థాలకి భిన్నంగా - వివాహమైన రోజునించే సంతానం కోసం ఎదురుచూడటం జరుగుతున్నది. ఇలాంటి వ్యవహారాన్ని దూరదృష్టిరాహిత్యం, తిరోగమనం అని తప్ప ఇంకేమనాలి.

ఇద్దరూ ఒకరితో ఒకరు అంగీకారానికి రాగలిగి, ముందుకు సాగటానికి తగిన కర్తవ్య నిర్వహణ చెయ్యగలిగే స్థితిపై ఆలోచన జరిపిన తరువాత వివాహం జరగాలి. వివాహానికి ముందు అలా జరగకపోతే దంపతులు సంతానోత్పత్తి అనే క్రొత్త బరువు బాధ్యతలు వహించక ముందే ఆ లోటును భర్తీ చేసికోవాలి. పిల్లల కోసం వెచ్చించే సమయాన్ని ధనాన్ని, మానసిక శక్తిని భార్యాభర్తలు ఒకరి బాధ్యత ఒకరు వహించటం కోసం వినియోగిస్తే అది అన్ని విధాలా విజ్ఞత అవుతుంది. ప్రగతి మార్గంలో జీవితాంతం నడవగల్గటం, దానికి భార్యాభర్తలు ఒకరికోసం ఒకరు పూర్తిగా సమర్పించుకోవటం అనేది మానవత్వపు గరిమను పెంచే విధానం. ఇందుకు అన్నిటికంటే పెద్ద ఇబ్బంది విశృంఖలమైన సంభోగం. దాని ఫలితంగా ఇద్దరూ ఒకరినొకరు శారీరకంగాను మానసికంగానూ రోగగ్రస్తులను చేసుకుంటారు ఆ కారణంగా మోయలేని బరువును తలకు ఎత్తుకునే పొరపాటు చేస్తారు.

కాముకత్వపు విష వలయంలో పడి జనం శరీరాన్ని, ఆలోచననూ కుంచింప చేస్తున్నారు. పెద్దవారైన తరువాత కూడా తమ సామర్థ్యములను విచ్చలవిడిగా వాడుతున్నారు. లాభనష్టాలను గురించి ఏమాత్రము ఆలోచించడం లేదు. ఇదంతా అతిభయంకరమైన అనౌచిత్యం. కాముకత వల్ల కలిగే శారీరక నష్టం బ్రహ్మచర్యపు వివేచనలోనూ చర్చకు వస్తుంది. కాగా అశ్లీలపు ఆలోచనల వలన మానసిక సామర్థ్యం సర్వనాశనమైపోతుంది. ఈ దురాలోచనలో చిక్కుకున్న మెదడు ఉన్నతస్థాయి ఆలోచనలు చేయలేదు. బుద్ధి ప్రతిభను ప్రదర్శించలేదు. అయినా ఈ వాస్తవాన్ని ఎవరూ గుర్తించడం లేదు. తరువాత ఆత్మవినాశనకరమైన బలహీనత మత్తుపానీయాల వ్యసనం వినాశనకరమైన బలహీనత కాముకత. ఈ కాముకత మహిళపట్ల

పూజ్యభావాన్నీ ఆమె అభివృద్ధికి దోహదం చేయాలని, సహాయం చేయాలన్న సదాశయాన్నీ చిన్నాభిన్నం చేస్తుంది. కాముకత యొక్క విజృంభణను అరికట్టకపోతే, దానివలన మహిళపై పిడుగుపాటు పడుతుంది. అంతేకాదు ఈ దిశలో విజృంభణకు ఉత్సాహం చూపించి సరంజామాను ప్రోగుచేసినవాడు కూడా రక్షింపబడడు. జీవనశక్తిసారాన్ని పిండి కాలువలో పారబోయడమనేది మిక్కిలి తెలివితక్కువ పని, ఆత్మవినాశకరమైన పని.

స్త్రీ, పురుషుల మధ్య అన్నదమ్ముల అక్కచెల్లెళ్ల సంబంధ బాంధవ్యాలు ఉండాలి. సంతానోత్పత్తి తప్పనిసరిగా అవసరము అనిపించినప్పుడే ఆ మరిగే నీటిలో చెయ్యిపెట్టాలి. ప్రపంచ పరిస్థితిని, సమాజ పరిస్థితినీ చూస్తుంటే - ఈ రోజుల్లో పెరుగుతున్న జనాభా అనేది ఒక్కటే ప్రతిరంగము లోనూ అనేక సమస్యలు, కష్టాలు, ఆపదలు పెంచుతోందనేది స్పష్టమవుతున్నది. వాటివలన ప్రగతికి కుంటుపడుతోంది. తనవారి, తన స్నేహితుల స్థితినీ, కుటుంబ స్థితినీ, సమాజ స్థితినీ పర్యవేక్షించి - సంతానోత్పత్తికి ఒకవిధంగా పూర్తి విశ్రాంతి ఇవ్వాలి. భయంకర దృశ్యాలను ఎదుర్కొనకుండా ప్రగతికి కావలసిన సరంజామాను ప్రోగుచేసికోవడానికి సాధనములను ఉపయోగించడం అందువల్ల సాధ్యపడుతుంది. కాముకత్వము ఎడల అత్యుత్సాహం ఒకప్పుడు క్షమించదగినదై ఉండవచ్చును. కానీ ఇప్పుడు ఆ చెడు ఆలోచనను అనుసరిస్తే ప్రమాదాలే ప్రమాదాలు. ఈ ధోరణి అదుపు కావాలి. మహిళల అభ్యున్నతికి ఈ క్షాళన అత్యవసరమని ప్రతిఒక్కరూ హృదయగతం చేసికోవాలి. గానుగలో పిండబడడంనుండి రక్షణపొందే మార్గం లభించినప్పుడు మహిళలు తమ సామర్థ్యాలకు కార్యరూపం ఇవ్వగలుగుతారు. అందువలన నవయుగంలో వారి భూమిక ఉంటుంది.

స్త్రీ, పురుషుల మధ్య అశ్లీలత వాసన రానివ్వకూడదు. ఆత్మీయతను, ఆదర్శవాదాన్ని, పరస్పర సేవాసాధనను పెంపొందించే ప్రగాఢమైన భావాన్ని వికసింపచేయాలి. సామర్థ్యాలను మిగుల్చుకుని వాటిని ప్రజాహిత కార్యాలలో వినియోగించాలి. నవయుగ అవతరణకు ఈ చర్య అత్యవసరం.

# దురాలోచనలను దూరం చేద్దాం, సృజనకు విలువ ఇద్దాం

సంత్ జ్ఞానేశ్వర్ తన చెల్లెలు, అన్నగార్లతో లోకకళ్యాణానికి కార్యరంగములో దిగారు. దివ్యదృష్టి గలవారు, ఋషులు కలసిమెలసి కామ వలయంలో పడకుండా మహా కార్యాలను చేసారు. వారి సంయుక్త సామర్థ్యం ప్రపంచాన్ని సుసంపన్నం చేసింది. లోకనాయక్ జయప్రకాశ్‌నారాయణ్, ఆచార్య కృపలానీ, జపానుకు చెందిన గాందీ కాగావా లాంటి మహానుభావులు ఒకటి ఒకటి కలిసి పదకొండు అవుతుంది అనే వాస్తవాన్ని పూర్తిగా తెలిసికొన్న తరువాతనే వివాహం చేసుకున్నారు, దానితోపాటు ఉన్నతస్థాయికి చెందిన ఆదర్శాలను జోడించి వివాహం అనే పదాన్ని సార్థకం చేసారు. ఈ రోజులలో కూడా అలాంటి ఆదర్శ వివాహాలు చేసుకోవాలి. అందువలన పెరిగిన పరస్పర సహకారానికి ప్రాణం పోయగలుగుతాము. అనేక కష్టాలను నివారించగలుగుతాము. సర్వతోముఖ ప్రగతికై మహత్తర కృషి చేయగలుగుతాము. ఈరోజులలో వికాసోన్ముఖమైన సేవాసాధనలు, అవాంఛనీయతలను ఎదుర్కొనే సంఘర్షణాశక్తి అనివార్య ఆవశ్యకతలు అవుతున్నాయి. ఈరోజులలో అటువంటి జంట ఆత్మలు – భార్య, భర్త, – కలసి సంయుక్త ప్రయత్నాలలో భాగస్వాములై వివాహ సంస్థను సార్థకంచేస్తే బాగుంటుంది.

సంతానోత్పత్తిలో మునిగిపోయిన తరువాత దంపతులు లోభ, మోహాల వలలో చిక్కుకుపోతారు. ఇక ఆదర్శనిర్వహణలో చెప్పుకోదగిన పురుషార్థం చేయగల్గటం అసంభవం అవుతుంది.

తీరికలేని మహిళలు సైతం, బంధనాలలో ఉన్న మహిళలుసైతం తమ విద్యా, స్వావలంబన, యోగ్యతల అభివృద్ధిలోనూ, తమ కుటుంబంలో ప్రగతికి బీజాలను నాటి పెంచటంలోను పాల్గొనవచ్చు. తమతో దగ్గర సంబంధం గలవారిలో శ్రమ, మితవ్యయం, సభ్యత, చక్కని వ్యవస్థ. ఉదారత్వం, సహకారం లాంటి సద్గుణాలు కల్గించవచ్చు. కుటుంబ సభ్యులను ఇంద్రియ నిగ్రహం కలవారుగాను ప్రగతిశీలురుగాను తయారుచేయటానికి ప్రయత్నించవచ్చు. మూఢాచారాలను గడ్డిపోచలలాగా పీకి అవతల పారవేయవచ్చు. మహిళా సంస్థలలో పాల్గొనటానికి ఉత్సాహం చూపవచ్చు.

బంధనాల, బాధ్యతల బరువు అంతగాలేని విద్యావంతులైన మహిళలు తమ తీరిక సమయాన్ని సోమరితనం, స్వార్థపరత్వం, బంధువులపట్ల తాపత్రయాల నుండి బయటపడి తమ సన్నిహిత రంగాన్ని ప్రగతిపథంపై ముందుకు తీసుకుపోవటానికి వినియోగించాలి. సంపన్న కుటుంబాలలో నౌకర్లు ఉంటారు కాబట్టి వారికి తీరిక లభిస్తుంది. పెద్ద కుటుంబాలలో ఉదార సంవేదనలను మేల్కొల్పగల్గితే కుటుంబంలో ఒకరిద్దరి స్త్రీల సమయాన్ని సేవాకార్యక్రమాలలో వినియోగిస్తూ ఉండేటట్లు చేయవచ్చు. ఉద్యోగము చేసే స్త్రీలు ఎక్కువ సమయం ఇంట బయట ఉంటారు. వారి వంట పనిని ఇంటిలోని ఇతరులు కలసిమెలసి పూర్తిచేస్తారు. మహిళా అభ్యున్నతిని భగవంతుని కృషిగా పరిగణించి, వారా పనికోసం నిశ్చింతగా కృషిచేయటానికి కుటుంబములోని ఇతర సభ్యులు సహకరించగల్గితే, ఎంతో పని జరుగుతుంది. ఉపాధ్యాయిని

లాంటి ఉద్యోగాలు దొరికినవారు తమ విద్యార్థినులతో వారి కుటుంబాలతో సంపర్కము ఏర్పరచుకొని ప్రగతికి సంబంధించిన చాలా పనులు చేయవచ్చు. పదవీవిరమణ చేసిన మహిళలు అనవసరపు విషయాలలో సమయాన్ని గడిపేకంటే ప్రస్తుత నవజాగరణ కార్యక్రమములో పాల్గొనవచ్చు. వితంతువులు, భర్తచేత వదిలివేయబడ్డ స్త్రీలు తమ దురదృష్టానికి ఏడుస్తూ, కూర్చునే కంటే సమయపు అవసరాన్ని పూర్తి చేయడంలో నిమగ్నులు కావచ్చు. తద్వారా తమ దురదృష్టాన్ని అదృష్టంగా మార్చుకోవచ్చు. ఎంతోమంది బాలికలు ఎక్కువ కట్నం ఇవ్వలేక గత్యంతరం లేక అవివాహితలుగా ఉండవలసి వస్తున్నది. అలాటి స్త్రీలు రోజులు గడపడానికి ఉద్యోగాలకోసం తిరగాలి. లేదా బంధువులను దయా దాక్షిణ్యాలకోసం ఆశ్రయించాలి, అలా చేయడం కంటే వారు మహిళాజాగరణ అనే భగవంతుని పనికి సహాయకులై తన దురదృష్టాన్ని అదృష్టంగా మార్చుకొని సమయపు అవసరాన్ని పూర్తి చేయడంలో తమ సమయాన్ని శ్రమను వినియోగించాలి. తమకు లభించిన మానవ జీవితాన్ని సాహసంతో సార్థకం చేసికోవాలి.

# రెండు ముందడుగులు - విద్య, స్వావలంబన

మహిళ అభ్యున్నతికి మొట్టమొదటి అవసరం విద్యాభివృద్ధి. మధ్యతరగతి కుటుంబాల బాలికలు పాఠశాలలకు వెడతారు. కానీ ఇల్లు-గృహస్థ జీవితం గడిపే ప్రౌఢస్త్రీలకు అలాటి మంచి అవకాశం రాదు. ఈ అవసరాన్ని తీర్చడానికి వేతనాలను పొందుతున్న ఉపాధ్యాయినులను కోరేకంటే అక్షరాస్యులైన స్త్రీలు తమ కుటుంబం - ఇంటిపనులలో ఏదో ఒక విధంగా సమయాన్ని మిగుల్చుకుని తమ చుట్టుప్రక్కల ప్రాంతాలలో

వయోజన పాఠశాలలు నడపడానికి శాయశక్తులా ప్రయత్నం చేయాలి. చదువుకున్న ఇతర మహిళలను ప్రోత్సహించి వారికి ఈ పని అప్పగించాలి, చదువుకున్న వయోవృద్ధులను కూడా ఖాళీ సమయాలలో ఈ పని చేయడానికి ప్రేరేపించాలి. ప్రగతికి విద్య తప్పనిసరి అవసరం అని తెలుసుకోవాలి. ఏ వయస్సు వారైనా, ఏ స్థితిలో ఉన్న స్త్రీలైనా – ప్రతి ఒక్కరికీ అక్షరాస్యులు అయ్యే అవకాశం లభించాలి. అక్షరజ్ఞానం లభించగానే వారికి వ్యక్తిత్వాన్ని వికసింపజేసేవీ, కుటుంబాన్ని సంస్కృతి నిష్ఠంగా తయారు చేసేవీ, సముదాయాన్ని అన్నివిధాలుగా సమున్నతం చేయడానికి మార్గదర్శకత్వం ఇవ్వగలిగేవి అయిన పుస్తకాలు లభించాలి. మనదేశపు రచయితల, ప్రచురణకర్తల ధ్యాస అటువైపు వెళ్ళకపోవడాన్ని దురదృష్టమనే అనాలి. ఈలోపాన్ని తీర్చడానికి స్వచ్ఛంద సేవాసంస్థలు ముందుకు రావాలి. మహిళలను ఉన్నతస్థాయికి చేర్చే సాహిత్యపు లోపాన్ని పూర్తి చేయాలి. మహిళా గ్రంథాలయాలను కూడా నిర్వహించాలి.

విద్యతోపాటు రెండవ అవసరం స్వావలంబన దిశలో ముందుకు సాగడం. స్థానిక పరిస్థితులకు అనుగుణంగా ఏదో ఒక కుటీర పరిశ్రమను ప్రతిచోటా నడపవచ్చు. వాటిని కనుగొని, సహకార పద్ధతిలో నడపగలిగితే ముడిసరుకును – సేకరించడం, తయారైన సరుకు అమ్మడంలాంటి పనులు అక్కడి సహకార సంఘాల ద్వారా నెరవేరగలవు. పేదలద్వారానే ప్రయత్నాలు జరుగవలసిన అవసరం లేదు. స్వావలంబన అనేది ప్రతి వ్యక్తి అనుసరించవలసిన ఒక గొప్ప ప్రవృత్తి. గృహ కార్యకలాపాలలో పగలూ రాత్రీ నిమగ్నమై ఉన్నప్పటికీ, ప్రత్యక్షంగా ఏమీ సంపాదించడం కనబడనందువలనే స్త్రీకి విలువ లేకుండా పోయింది. ఈ సమస్య పరిష్కారానికి జపానులో లాగా మనదేశంలో కూడా ప్రయత్నాలు జరగాలి. మనదేశంలో కుటీర పరిశ్రమలకు ప్రతిచోటా అవకాశాలు ఉన్నాయి.

స్త్రీలు కొంత సంపాదనలో నిమగ్నమైతే ప్రశంసనీయములైన ఇతర కార్యములు చేయడానికి సిద్ధమైతే – ఇంట్లోని పురుషులకు దానిలో నీచత్వం కనిపిస్తుంది. వారు దానిని వ్యతిరేకిస్తారు. వికృతమైన ఈ ఆలోచన నుండి నివృత్తి పొందడానికి పేద – ధనికుల ఇళ్ళన్నిటిలో కుటీర పరిశ్రమలలాంటి స్వావలంబన సాధనాలు చలామణి అవ్వాలి. కనీసం ప్రతి ఇంట్లోనూ కూరగాయల తోట పెంచవచ్చు. స్త్రీలకు కూడా ఆర్థిక స్వావలంబన అవసరం. వారికి కూడా వ్యక్తిగతమైన బ్రతుకు దెరువు కావాలి. దానివలన ప్రతిక్షణం పరావలంబన ఒత్తిడులను సహించవలసిన అవసరం తప్పుతుంది. వారుకూడా స్వేచ్ఛగా ప్రగతి ప్రక్రియలో భాగస్వాములు కాగలుగుతారు.

# మహిళ విలువ పెంచాలి.

గర్భం ధరించడం మహిళలకు తప్పదు. కానీ పిల్లలను పెంచి పోషించడంలో తండ్రి తగు భాగస్వామ్యం వహించాలి. ఆర్థికంగాను, ఇతరత్రాను పురుషుడు ఎంత గొప్పవాడైనా పిల్లలను ప్రేమించడం లోనూ, ఆడించడంలోనూ, తినిపించడంలోనూ, సమస్యలను పరిష్కరించడంలోనూ, పిల్లలను సంస్కారవంతులుగా తయారు చేయడంలోనూ అతడు నియమబద్ధంగా సమయాన్ని వినియోగించాలి. ప్రపంచమంతటా ఈ భావన వ్యాపించి ఉంది. కొద్ది నెలల క్రితమే స్వీడన్ ప్రభుత్వం ఒక నిర్ణయం చేసింది – ప్రసవసమయంలో స్త్రీలు ఉద్యోగములకు సెలవు పెట్టవలసి వచ్చినట్లుగానే, పురుషులు కూడా పిల్లల పెంపకం, పోషణలో తనవంతు బాధ్యతలను వహించటం కోసం సెలవు తీసికొని పిల్లలతోపాటు ఉండాలని. దీనికి పురుషులు అభ్యంతరం తెలిపారు అలా చేసినందువలన తమ సీనియారిటీ తగ్గి పదోన్నతి ఆగిపోతుందనీ, పోటీలో పాల్గొని ఉన్నత

పదవులు పొందడంలో అసమర్థులమవుతామని వారన్నారు. ఇదే తర్కం మహిళ కూడా చేయవచ్చు కదా అని చెప్పి ఈ అభ్యంతరాన్ని ప్రభుత్వం త్రోసిపుచ్చింది. వారుకూడా నష్టాన్ని భరించి కష్టాన్ని సహించవలసి వస్తుందికదా అని ప్రభుత్వం అన్నది. సంతానోత్పత్తికి పురుషుడుకూడా అంతే ఉత్సాహాన్ని చూపించనప్పుడు, దాని ఫలితాల నుంచి నివృత్తి పొందడానికి తన బాధ్యతలను వదిలించుకొని పారిపోవడానికి అతడు ఎందుకు ప్రయత్నం చెయ్యాలి? ఆ చట్టం వరకు శిక్షను స్త్రీ ఒక్కతే అనుభవిస్తున్నది. ఇక పురుషులు కూడా లాభంలోనేగాక నష్టంలో కూడా సహభాగస్వాములు కావలసి ఉంటుంది. ఈ చట్టం అమలు స్వీడన్‌లో ప్రారంభమయినప్పటికీ, దీని విస్తరణ అన్ని దేశాలలో జరుగుతుంది. సూర్యుడు పర్వత శిఖరములపైనుండి ఉదయిస్తున్నట్లు కనిపిస్తున్నా, ఆ వెలుగు క్రమంగా ప్రపంచమంతటా వ్యాపిస్తుంది. జపానులో రాజకీయ రంగంలో మహిళలు ఉత్సాహంగా పాల్గొంటున్నారు. ఆ ప్రభావం భారతదేశంమీద కూడ పడింది. వారికి 30 శాతం స్థానాలు కేటాయించారు. ఇక ఈ ప్రక్రియ విస్తరిస్తుంది. స్త్రీలను హీనంగా భావించటం, భయపెట్టడం, వారి పట్ల భేదభావంతో ప్రవర్తించటం క్రమంగా అన్ని దేశాలలో అంతమవుతుంది. కొందరు సణుగుకున్నా కాలగతి ముందు ఆ వ్యతిరేకత నిలవదు.

ఖచ్చితంగా జరిగి తీరే దానిని వ్యతిరేకించటంకంటె తరుణం మించిపోకముందే దానితో రాజీపడి సదాశయాన్ని చూపించడం ప్రయోజనకరం. ఆంగ్లేయులు కాలగతిని గుర్తించారు. కనక ఎదురు దెబ్బతినే ఇబ్బందికర పరిస్థితులను నివారించారు. రాజీ పద్ధతిని అవలంబించి కఠినత్వానికి బదులు సద్భావనతో తిరిగి వెళ్ళిపోయారు. ఫలితంగా – భారతదేశం స్వేచ్ఛగా కామన్‌వెల్త్‌లో సభ్యత్వం స్వీకరించింది.

హరిజనులు, గిరిజనులు ముందుగా రిజర్వేషన్‌లు, ప్రత్యేక సదుపాయాలు పొందారు. సమయముండగానే సమానత్వానికి వారి హక్కులను స్వీకరించటం జరిగింది. చేసిన తప్పులకు ప్రాయశ్చిత్తం జరుగుతున్నది. ఈ సద్భావనను చూపకపోతే ప్రపంచములో వీస్తున్న వికాసపు గాలి వారిని ఉత్తేజితులను చేసి తీరుతుంది. చక్కని వాతావరణంలో జరుగుతున్న ఈ మార్పుల కోసం మొండిపట్టుదలతో హఠం చేస్తే, మరింత నష్టాన్ని ఎదుర్కోవలసి వచ్చేది. స్త్రీల యెడల కూడా పురుష వర్గం సమయముండగానే న్యాయోచితమైన అధికారాలకు గుర్తింపు ఇస్తే, ఇరుపక్షాలూ ప్రయోజనం పొందుతాయి. లేకపోతే ఘర్షణ పడే పరిస్థితి వచ్చి, మాటామాటా పెరుగుతుంది. ఆ పొరపాటును సరిదిద్దుకోవటానికి చాలా సమయం పడుతుంది. ప్రపంచంలో స్త్రీ ప్రధానమైన సమాజ వ్యవస్థ కొనసాగుతున్న ప్రాంతాలు అనేకం ఉన్నాయి. అచ్చట అధికారాలన్నీ స్త్రీల చేతులలోనే ఉన్నాయి. పురుషులు అశక్తతతో వారికి ఆజ్ఞాబద్ధులుగా మాత్రమే ఉండవలసి వస్తోంది. అలాంటి పరిపూర్ణమైన పరివర్తనను ఎదుర్కోవలసిన అవసరం మన సమాజానికి రాకపోతే బాగుంటుంది. గడచిన శతాబ్దంలో లెక్కలేనన్ని రాజకీయ, సామాజిక, బౌద్ధిక ఉద్యమాలు జరిగాయి. వాటిలో యథార్థం, న్యాయం, నిష్ఠ మాత్రమే జయించాయి. కాని తలచుకోగానే గగుర్పాటు కలిగేటటువంటి గందరగోళంతో కూడిన సంఘటనలను ఆ చరిత్ర వదిలి వెళ్ళింది. ఆనాటి ఈర్ష్య, ద్వేషాలు ఇప్పటివరకూ ఆలోచనాపరుల చెవులలో ప్రతిధ్వనిస్తున్నాయి. ఓటమి పొందినవారి యెడల సానుభూతికి బదులు తిరస్కారమే వ్యక్తమవుతున్నది. అలాంటి దుర్దినాలను చూడవలసిన పరిస్థితి రాకుండా జాగ్రత్త పడడమే విజ్ఞత. సమత్వం, ఐక్యతల కోసం జరిగే పరివర్తన ఎవరో ఆపితే ఆగేది కాదు. మహాఅయితే అందుకు

సమయం పట్టవచ్చు.

అవినీతి, దుష్ట భావనలు, అహంకారం మహిళా వికాసానికి ప్రముఖమైన ఆటంకాలుగా తయారయాయి. ఔచిత్యాన్ని పాటించి లాభనష్టాలను సరిగ్గా అంచనా వేసికొన్నట్లయితే – సంఘర్షణలో చిక్కుకొనేకంటే సహకార విధానాన్ని అనుసరించడం మరింత శ్రేయస్కరం అనిపిస్తుంది. ఉన్నతి పొందడంలో సహాయం చేసి కృతజ్ఞతను పొందడంలో లాభమే లాభం. ఈ లాభాలను నేడు మంచి అవకాశం దొరికినపుడు వినియోగించుకోకపోతే సమయం దాటిపోయాక ఆశించిన దానికంటే ఎక్కువ నష్టాన్ని భరించవలసివస్తుంది. సమత్వం, ఐకమత్యముల సిద్ధాంతంను ప్రపంచమంతా అనుసరించ వలసి వస్తున్నది. సగం జనాభా అయిన మహిళలను అలాటి గొప్ప పరివర్తనకు దూరంగా ఉంచడానికి జరిగిన ప్రయత్నాలు గతంలో సఫలమవుతూ వచ్చాయి. కానీ నేడు ఫ్యూడలిజం పోయింది. ఇప్పుడు సామాజిక ఫ్యూడలిజం కూడా వెళ్ళిపోయే సమయం వచ్చేసింది. దానిని తిరిగి తేవడం కుదరదు.

భారత ప్రజలు అసాధ్యం అనిపించిన స్వరాజ్యాన్ని అహింసాయుత సత్యాగ్రహ సిద్ధాంతంద్వారా సాధించారు. దాని అనంతర చర్యగా సామాజిక విప్లవాన్ని సాధించాలి. సత్యాగ్రహపు రోజులలో మొత్తం భారతదేశంలోనేకాక ప్రపంచమంతటా పెల్లుబికిన విధానాన్ని న్యాయ సాధనలో కూడా అనుసరించాలి. మహిళా విముక్తి ఉద్యమం పాశ్చాత్య దేశాలలో వైమనస్య వాతావరణంలో ఘర్షణలు ప్రతీకారాల రూపంలో సాగుతున్నది. వారు ఘర్షణ మార్గాన్ని వదలి ఔదార్యంతో కూడిన రాజీ మార్గాన్ని అనుసరిస్తే కఠోరంగా కనిపించే పోరాటం చక్కని సుహృద్భావ వాతావరణంలో సమాప్తం అవుతుంది.

భ్రమలు తొలగితే కాయకల్పం జరుగుతుంది. స్త్రీ పురుషులు ఇద్దరూ ఒకే నాణెమునకు బొమ్మాబొరుసు అని గుర్తించాలి. ఐకమత్యం మరియు సద్భావనలతో కూడిన వాతావరణంలోనే వారి మధ్య సహకారం వికసిస్తుంది. చెక్కుచెదరకుండా నిలుస్తుంది. బాలబాలికల మధ్య, వధూవరుల మధ్య విచక్షణ ఇక పూర్తిగా అంతమైపోవాలి. ఇద్దరినీ రెండు చేతులు, రెండు కాళ్లు, రెండు చెవులవలె పరస్పర సహకారులుగా సమానులుగా పరిగణించి వ్యవహరించడం విజ్ఞత.

# ఏకత, సమతల సంగమం

భార్యాభర్తలు ఒండొరులకు దాసులు కారు, యజమానులు కారు. ఇద్దరి మధ్య అన్నదమ్ముల మధ్య, అక్కచెల్లెళ్ల మధ్య ఉండే సద్భావన, సహకారం ఉండాలి. తన లాభం మీద శ్రద్ధ తక్కువగా, స్నేహితునికి మేలు చేసే ధ్యాస ఎక్కువగా ఉన్నపుడే స్నేహం స్థిరపడుతుంది. పుష్పించి ఫలిస్తుంది. ఈ మాత్రం మార్పు చేసుకోగలిగితే మన కుటుంబ పరిస్థితి, సామాజిక పరిస్థితి అద్భుతంగా మారిపోతాయి. అదృష్టం అవతరిస్తుంది. ఉల్లాసం ఉరకలు వేస్తుంది.

అమృతంలో విషాన్ని కలిపే కామపు దృష్టిని నిర్మూలించగలిగితే మన శారీరక, మానసిక, సామాజిక, నైతిక ఆరోగ్యములతో నవజీవనం వెల్లివిరుస్తుంది. ఇది యుగసంధ్య. ఈ పుణ్య సమయంలో లైంగిక క్రియలు నిషిద్ధములు. సూర్యగ్రహణం, చంద్రగ్రహణపు క్షణములలో వివేకవంతులు ఇంద్రియ నిగ్రహము కలిగి ఉంటారు. ఆ సమయమును శ్రేష్ఠమైన పుణ్యకార్యాలకు కేటాయిస్తారు. ఈ యుగసంధి సమయం అలాంటిదే. ఈ సమయంలో సంతానోత్పత్తి కార్యానికి విరామం లభించాలి. దుష్టఘడియలలో గర్భధారణ ఫలించి భూమిపైకి వచ్చే శిశువులలో అనేక

వికృతులు ఏర్పడతాయి. యుగసంధివేళ మహిళా పునరుద్ధరణ వ్రత దీక్షకు తగు తరుణం. ఈ సమయంలో సంతానోత్పత్తి ఉద్రేకాన్ని చల్లబరచకపోతే దీని తాపం వల్ల ఎన్నెన్నో మాడిపోతాయి. ఈ రోజులలో ప్రపంచానికి తీవ్రమైన ఆపద అధిక సంతానమే. దానిని నిరోధించి ఆపినట్లయితే సత్యయుగం తిరిగి వస్తుంది. భూగోళంపై కొన్ని కోట్లమంది మనుష్యులు మాత్రమే ఉండి దైవీయ జీవితం గడుపుతారు.

స్త్రీ, పురుషులు సంతానోత్పత్తి విషయంలో పూర్తి బాధ్యతతో ప్రవర్తించడం అసామాన్యమైనది. అధిక సంతానం విషయంలో మహిళ తన ఆరోగ్యాన్ని, తన విశ్రాంతినీ పూర్తిగా కోల్పోతుంది. ఈ దుష్ప్రవృత్తి ఫలితంగా పురుషుడు 20 సంవత్సరాలు శిక్ష అనుభవించవలసి వస్తుంది. అతడు పెరిగిన తన కుటుంబపు అవసరాలను తీర్చటానికి ఇన్ని రోజులూ ఖర్చు చేయవలసి వస్తుంది. ఈ యదార్థాన్ని దృష్టిలో ఉంచుకుని జీవితంలో కొన్ని మహత్తర కార్యాలు సాధించదలచిన వారు క్రొత్త సంతానాన్ని పరిహరించాలి. ప్రపంచమనే కుటుంబంలో ఉన్న ప్రస్తుత సభ్యులనే తమ వారుగా భావించాలి. తన సంతానానికి ఆస్థిని అప్పగించడానికి జరిపే కృషిని వారి అభ్యుదయం కోసం మళ్లించాలి.

# సంతాన నిరోధం తప్పనిసరి

ఈ రోజులలో సంతాన నిరోధ అవసరం అనేక కారణాల వలన అనేకరెట్లు పెరిగింది.

యుగసంధి సమయంలో సూక్ష్మ జగత్తు సృష్టి, లయల పనిలో పూర్తిగా నిమగ్నమై ఉండడం ఒక కారణం. దాని దుష్ట ప్రభావం ఈ రోజులలో జన్మించే వారిపై పడకుండా ఉండదు. అందువలన కలిగే అనేక బాధలు, భయాలు సహించేకంటే సంతానోత్పత్తిని నిలిపివేసి మనం

21వ శతాబ్దంలో అవతరించే దివ్య ఆత్మలతో మన వంశాలను ధన్యం చేసుకోవడం మేలు. తపస్వులు ఇంద్రియ నిగ్రహ సాధన ఫలితంగా సిద్ధులు, విభూతులు పొంది ధన్యులైన విధంగా.

రెండవ కారణం ఇది ఈనాడు ప్రతి స్త్రీకి ప్రతి పురుషునికి మహాకాలుని ఆహ్వానం, యుగధర్మపు పిలుపు ఏమనగా – స్త్రీ పునరుద్ధరణ కోసం వారు అన్నివిధాలా తమనుతాము సమర్పించుకోవాలి; తరతరాలుగా కొనసాగుతూ వస్తున్న అనాచారాలకు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి; పూర్వీకుల పొరపాట్లను సరిదిద్దుకోవాలి. దేశాన్ని, సమాజాన్ని ఉన్నతస్థాయికి చేర్చటానికి మామూలు రోజుల కన్న అనేక రెట్లు ఎక్కువ విలువైన సమయం ఒకోసారి వస్తుంది. యుద్ధసమయంలో దేశంలోని సమర్థుడైన ప్రతి వ్యక్తినీ తప్పనిసరిగా సైన్యంలో చేర్చుకుంటారు. ఈశ్వరుని ఆధ్వర్యంలో సమర్ధవంతుడైన ప్రతివ్యక్తికీ సగం జనాభాకు రక్షణ కల్పించడానికీ, వారిని ప్రాచీనపరంపరలో తిరిగి జోడించడానికి తరుణం ఇదే. దీనిలో లోభ మోహాలను ముఖ్యంగా కామవాంఛను, అదుపు చేయగలిగితే ప్రతి ఒక్కరికీ కొద్దోగొప్పో మంచి చేయడానికి అవకాశం ఏర్పడుతుంది.

ఆ పని విశేష ప్రశంసలను అందుకుంటుంది. ఈ పనివల్ల మన సమాజం మరల ప్రపంచానికి సర్వతోముఖమైన నాయకత్వం అందించగలుగుతుంది. బుద్ధునికాలంలో సన్యాసులు, సన్యాసినుల వెల్లువ పెల్లుబికింది. అలాంటి సమయం ఇది. ఈ పని ఆధారంగా సగం ప్రపంచం కళ్యాణాన్ని, శ్రేయస్సునూ పొందగలుగుతుంది.

మూడవ కారణం ప్రపంచములో అణుయుద్ధం, కాలుష్యం, స్వార్ధపూరిత సంఘర్షణలవలె జనాభాపెరుగుదల సంక్షోభం కూడ

సర్వనాశనకర పరిణామంగా తయారయింది. ఈ ఆపద తొలగిపోకపోతే వివిధ రంగాలలో కొనసాగుతున్న ప్రగతి పథకాలలో ఏ ఒక్కటీ సఫలం కాదు. అంతే కాదు, వినాశకర సంఘటనల దాడి మరింత భయానకం అవుతుంది. కనీసం ఈ యుగ సంధి తరుణంలో అయినా జనాభాను అదుపు చేయగలిగితే ప్రపంచమంతటా సంస్కృతికి ఊపిరి పీల్చుకోవటానికి అవకాశం లభిస్తుంది.

నాల్గవకారణం కూడా ఉన్నది. మహిళా కల్యాణమే విశ్వ కళ్యాణం ఈ సమయంలో దానికి తగు అవకాశం లభించగలదు. పెరుగుతున్న వయస్సు పొంగును దేశ రక్షణకు చెందిన సైనికసేవలోవలె ఉపయోగించగల్గితే నవ సృజనకు ద్వారాలు తెరుచుకుంటాయి.

భారతదేశపు ప్రముఖ నదులు హిమాలయంలో జన్మిస్తున్నాయి. దేశపు నీటి అవసరాలలో ఎక్కువ భాగం పూర్తి చేస్తున్నాయి. చైతన్యరంగమైన హిమాలయంలోని శాంతికుంజ్ నుండి ప్రపంచమంతటికీ బహుముఖ ప్రక్రియల సంచలన జరుగుతోంది. మహిళా జాగరణ వానిలోని ఒక గొప్ప ప్రక్రియ. దీని కోసం ప్రచార, ప్రసారాల ద్వారా గొప్ప పరివర్తన ప్రక్రియ కొనసాగుతూ ఉన్నది. వ్యావహారిక మార్గదర్శనం కోసం ప్రతి నెలలో తొమ్మిది రోజుల శిక్షణా శిబిరాలు నడపబడుతున్నాయి. ఈ శిబిరాలలో శిక్షణ పొందిన వారు నవ చైతన్యాన్నీ ప్రేరణ శక్తినీ పొంది తిరిగివెడతారు. దానితో బాటు మార్గదర్శకత్వాన్ని కూడా పొందుతారు. దాని ప్రకారం పరమార్థం పథాన్ని అనుసరిస్తారు. వారికి కూడ ఎంతో అవసరమైనది, మహత్తర మైనది.

హృదయంలో మహిళా అభ్యున్నతికై సేవాసాధన, తపశ్చర్య చేయాలనే తపన ఉన్నవారు మార్గదర్శనం పొందటానికి హరిద్వార్‌లోని

శాంతికుంజ్‌తో సంపర్కం స్థాపించుకోవచ్చు. నిరంతరం కొనసాగే శిబిరాలలో ఏదో ఒక దానిలో ప్రవేశం పొందటానికి అభ్యర్థన చేయవచ్చు.

ఈ యుగ సంధి సమయంలో వివాహబంధానికి కట్టుబడడం అవసరమైన వారు కనీసం వరకట్నం, నగలు, అట్టహాసాలు లేకుండా ఆ బంధాన్ని ఏర్పరచుకోవాలి. అటువంటి మంచి అవకాశం తమవద్ద లేకపోతే వారు శాంతికుంజ్‌కు వచ్చి ఏవిధమైన ఖర్చు లేకుండా వివాహం చేసుకోవచ్చు. పిల్లలున్నవారు వారి చేత కనీసం తమ పిల్లలకు ఆడంబరపు వివాహాలు చేయము అని ప్రతిజ్ఞలే చేయించాలి. మహిళా అభ్యున్నతికి ఈ ఉద్యమం అత్యవసరం. యుగ అవసరాన్ని – ప్రాధాన్యాన్నీ గుర్తించి, భావనాశీలురైన ప్రతిభావంతులంతా మహిళా జాగరణ దిశలో నిర్దిష్టమైన కృషి జరపాలి.

H H H